

If I can guide some erring to truth
Inspire within his heart a sense of duty;
If I can plant within the soul of a rosy plant
A sense of light, a love of truth and beauty;
If I can teach one man that God and Heaven
are near,
I shall not have, then, lived in vain while here.

సీ॥ సత్యమూరుండయి చనియెడు నొక
సహోదరునికి సత్య తత్త్వంబు దెలిపి
ఆతని హృదయ కంజాతమ్ములో ధర్మ
జిజ్ఞాస పొడసూప జేసితేని
రహీని రోజాపుష్పరాజకోమలమునై
యకలుషితమ్మైనట్టి యాత్మలోన
స్వాత్మవివేకము సత్యసుందరముల
ప్రీతిని నోలి స్థాపింతు నేని
గీ॥ తనహృదయమందె స్వర్గము దైవతమును
గలవనెడుబుద్ధి నొకనికి గలుగునట్లు
చక్కగా బోధనము జేయ జాలుదేని
నాదుజన్మము సఫలముగాదె వసుధ.

ఓమ్

# దైవప్రార్థన - కీర్తనలు





తే. ఆంధ్రదేశము నెల్లెడ నలముకొనిన
శుష్క వేదాంత మణచిన శుభ చరిత్ర!
మద్గురూత్తమ! మలయాళ మౌనివర్య!
అమల కారుణ్య దృష్టి నన్నరయుమయ్య!

: ప్రకాశకులు :

భ జ న బా బు

ప ర మా త్మా నం దా శ్ర మ ము

పె న మ లూ రు,

విజయవాడ తాలూకా, కృష్ణాజిల్లా

1962

సర్వోదయ ప్రెస్,
పటమటలంక.

వెల: 0.50 న. పై.

# విషయసూచిక





శ్రీ మహర్షి మలయాళ స్వామినే నమః

# దైవ ప్రార్థన - కీర్తనలు



కూర్చున్నవారు : శ్రీ మలయాళస్వాములవారు

నిల్చున్నవారు : శ్రీ సాధు భజనబాబు

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః



భజనబాబు

## కీర్తన

తెనుగన్నా! ఓ తెనుగన్నా!

తెనుగుగడ్డకు పేరు తెచ్చుకోలేవా! ॥తె॥

1. మనలో ఉన్నారు ఘనులంటె, ఓర్వనే లేవు।

కన్నారు కళలంటె గర్వింప లేవు ॥తె॥

2. అయ్యోరుల పాటంటె వెయ్యినూటపదహార్లు
తెనుగు పాఠకుడంటె దినభిక్షమియలేవు ॥ తె॥

3. ఆది కవి వాల్మీకి యంశాన జన్మించె
ఒంగోలు ప్రాంతాన ఘనుడైన త్యాగయ్య ॥ తె॥

4. కడపజిల్లా యందు, కవిరాజు పోతన్న
వీరబ్రహ్మంబును వెలసిరోరన్న ! ॥ తె॥

దైవాత్మ స్వరూపులగు ప్రియమైన ఆత్మ బంధువులారా! నేను జన్మించినది ఒంగోలు పట్టణం. మా తాత తోట ఆదినారాయణగారు. వీరి ప్రథమపుత్రుడు వెంకయ్య, ద్వితీయ పుత్రుడు రంగయ్య. వీరిలో వెంకయ్య మా తండ్రి గారు. మాతల్లి సుబ్బమ్మగారు. వీరికి సంతానము ఆరుగురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు. వీరిలో ప్రథమ కుమారుడు ఆదినారాయణగారు. ద్వితీయపుత్రుడను నేను. సుబ్బారావు అని నన్ను పిలుచుచుండిరి. 1936 వ సంవత్సరం శ్రీ రామానుగ్రహముపలన భద్రాచలములో శ్రీరాముని సన్నిధిని 4 మాసములు కాలముగడిపి, తదుపరి గద్దలగుంట (ఒంగోలు)లో శ్రీరామాలయములో పూజారిగా నాలుగు సంవత్సరములు కాలముగడపి ఆ తదుపరి 1941 వ సం.లో శ్రీ వ్యాసాశ్రమమునకువచ్చి సద్గురు సన్నిధిని సంకీర్తన చేయుచుండగా శ్రీ మహర్షి మలయాళస్వాములవారు నాకు భజన బాబు అనుపేరుపెట్టిరి. శ్రీ మలయాళ స్వాములవారి అనుమతితో 1950 వ సంవత్సరం నుండి కృష్ణాజిల్లా పెనమలూరు లోని శ్రీ పరమాత్మానందాశ్రమములో నున్నాను.

శ్రీపరమాత్మానందాశ్రమము
పెనమలూరు, కృష్ణాజిల్లా

ఇట్లు; భక్త జన పాదరేణువు
భజనబాబు



ఓమ్ తత్ సత్

ఓం కలౌ స్మరణాన్ముక్తిః। అహింసా పరమో ధర్మః॥
రఘుపతి రాఘవ రాజారాం పతిత పావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరే నాం సబ్ కో సన్మతి దే భగవాన్.

# దేవుడనగా ఎవరు?

కొలంబియా బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ డైరెక్టరు లండన్ పట్టణమున గాంధీమహాత్ముని దర్శించి, దేవుడనగా యెవరని అడిగిరి?

1. మహాత్ముని జవాబు:- నాచుట్టునున్న ప్రపంచములోని సర్వ చరాచర వస్తువులు పుట్టుట, లయించుట మున్నగు పరిణామములు జెందుచున్నను, వీని కాధారమై యెట్టి పరిణామమునూ్నా చెందనట్టి చైతన్యశక్తియే దేవుడు. ఏలన మృత్యుమధ్యమందు అమరత్వమున్ను, అంధకారమున అంత ర్జ్యోతి, అనంత దుఃఖమధ్యమున ఆనందానుభవమే దేవుడు. ఈ ప్రత్యుత్తరమునకు లక్షరూప్యములను మహాత్మాజీకి ఆ కంపెనీ డైరెక్టరు పారితోషికముగ సమర్పించి కృతకృత్యుడనైతినని విన్నవించెను.

గాంధిజీ ఆత్మకథ:- భగవంతునియందు నాకు పూర్ణ విశ్వాసము కలదు. నా జీవితములో అనేక కష్టసమయముల

యందు దేవుడు నన్ను రక్షించెను. భోజనముచేయుట, నీరు త్రాగుట, కూర్చుండుట మొదలగునవి మనకెట్లు నిజమో అట్లే పూజ, ప్రార్థన, ధ్యానముకూడా సత్యము. ఇది అంధ విశ్వాసముకాదు. సంపూర్ణమైన సత్యము, స్వానుభవము, అదియే దేవుడు.

2. శ్రీ రామకృష్ణ పరమహంస:- ఒకటి దేవుడు. సున్న జీవుడు. సున్నకు విలువ సంఖ్య వున్నపుడే. లేనిచో దానికి విలువేది? అలల కాధారము సముద్రమెటులనో, ఈ సగుణ ప్రపంచమున కాధారమైన అనంత చిదాకాశరూపుడే దేవుడు.

3. శ్రీ వివేకానందస్వామి:- లోకసేవకై ఈ దేహమును నాహుతి యొనర్చుడు. తీవ్ర తపస్సుచేసి నేను గ్రహించిన మహత్తర సత్యమిది. దృశ్యమానమగు యీ సమస్త జీవకోటియు దైవస్వరూపమే. అస్తి, అస్తియను సద్భావమును ప్రకటింపుడు. ఆస్తిక్యభావమును వృద్ధి జేసుకొనుడు. నాస్తి, నాస్తి యను వ్యతిరేకభావములను వదలుడు. ప్రతిజీవి యందును అనంత దైవశక్తి కలదు. తన పురుషప్రయత్నము వలననే తన్నుద్ధరించుకొనవలయును. తన్ను తా నుద్ధరించుకొను పురుష ప్రయత్నమే దేవుడు.

4. శ్రీ స్వామిరామతీర్థ:- దేవుని భక్తియనగా బిచ్చమెత్తుట, ఏడ్చుట, తలబాదుకొనుట కాదు. అనిర్వచనీయమగు సమత్వదృష్టి, సర్వస్వరూపియగు దేవుని నన్నిటిలో దర్శించుటయే. ఈ విశ్వమంతయు దేవుని స్వరూపమేనని యు, అదియే తనస్వరూపమనియు తెలుసుకొనుటయే దేవుడు.

5. శ్రీ రమణభగవాన్:- తాను విశ్వము, దైవము వేరుకాదు ఒకటే. తన్నెరుంగుటయే దేవు నెరుంగుట. అదియే దేవుడు.

6. శ్రీ అరవిందులు:- తాను విశ్వరూప భగవానుని ప్రేమించి, వారికి తన్నర్పించుకొనుచో, తనకు విశ్వరూపమునే భగవానుడు ప్రసాదించును. సముద్రమునకు తన్నర్పించుకొన్న ఉప్పుకణువు సముద్రమే తానగుచున్నదికదా.

7. శ్రీ మహర్షి మలయాళస్వామి :- అజ్ఞానదృష్టి, జ్ఞానదృష్టి, విజ్ఞానదృష్టి అని దృష్టులు మూడు విధములు. కులమును మాత్రమే చూచుట అజ్ఞానదృష్టి. సర్వులలోని గుణములను పరికించుట జ్ఞానదృష్టి. ఈ విశ్వమంతయు భగవత్ స్వరూపముగ చూచుట విజ్ఞానదృష్టి. అట్టి విజ్ఞానదృష్టియే దేవుడు.

8. శ్రీ భజనబాబు:- దైవాత్మ స్వరూపులగు మహాజనులారా! ప్రపంచములో సత్యాసక్తులగు ఉత్తమ పురుషులు మిక్కిలి కొలదిమందియే యున్నారు. వారి శక్తివలననే యీ ప్రపంచము నిలిచియున్నది. అట్టివారు కొలదిమందియైనను వారిశక్తి అద్భుతమైనది. అట్టివారిశక్తి దైవశక్తిలో అంతర్భాగమే. అట్టి శక్తియే దేవుడు.



# భగవాన్ శ్రీ శ్రీ శ్రీ మలయాళ మహర్షులవారి

# నక్షత్రమాలికా స్తోత్రం

రచన : స్వామి నిర్విషయానంద

శ్రీ సద్గురు శ్రీ సద్గురు జయ సద్గురు దేవా !
శ్రీ సద్గురు శ్రీ సద్గురు జయ సద్గురు దేవా !

1. అగణిత గుణగణ నిలయా ! అత్యంత కృపాహృదయా!
2. యతిజన సంస్తుతి పాత్రా ! అఖిల చరాచర మిత్రా !
3. కేరళ భూ సంజాతా ! కేవల తత్త్వానంతా !
4. దినకర సమ వ్రత ధారీ ! దీనజనార్తి నివారీ !
5. పరిపూర్ణ విరాగాత్మా ! పరతత్త్వ సుబోధాత్మా !
6. గోగర్భ గుహావాసా ! గురుతర ప్రజ్ఞా భాసా !
7. తీవ్ర తపః సంతప్తా ! దివ్యాశయ సందీప్తా !
8. స్త్రీజన రక్షణ దీక్షా ! స్థిర సుఖ సంయమ దక్షా !
9. పావన శాస్త్ర విచారా ! పామర సంఘ విదూరా !
10. నానా గ్రంథ రచయితా ! నారాయణ ప్రియ చరితా!
11. గీతా బోధన మోదా ! కృత సత్కార్య వినోదా !
12. వ్యాసాశయ పరిపాలా ! భాసుర సద్గుణ శీలా !
13. యుక్తాహార విహారా ! ఉత్తమ ముని మందారా !
14. మాయా గుణ సంహారా ! మలినాచార విదూరా !
15. ధ్యానావస్థిత చేతా ! ధైర్య సుశౌర్యోపేతా !
16. బహు జన్మ దురిత హారీ ! పావన ధర్మోద్ధారీ !
17. ఆంధ్రావని పుణ్యఫలా ! అమనస్క పదవిలోలా !
18. విద్యావ్యాప్త సురూపా ! విశ్వమైత్రైక్య ప్రదీపా !

19. స్వాధ్యాయ నియమ పోషా! సజ్జన హితయతి వేషా!
20. జాతిద్వేష నివారీ! సంశయ జలధరదూరీ!
21. వ్యాసాశ్రమ సంస్థాతా! పావన విద్యాదాతా!
22. ప్రవిమల దృక్పథ దీప్తా! బ్రాహ్మీపద స్థిర ప్రాప్తా!
23. స్థిర సద్భావ సుకీర్తీ! శ్రేయోదాయక మూర్తీ!
24. నైష్ఠిక సద్వటు పోషా! నైజ సుమంజుల భాషా!
25. కౌశల కర్మాచరణా! కల్మష నాశక చరణా!
26. శాస్త్ర విహితమితభాషా! సచ్ఛీల నియమపోషా!
27. నత పావన పద కమలా! నవధర్మాన్వయపాలా!
28. మమతాహర నిస్సంగా! మదమాత్సర్య విభంగా!
29. స్వారాజ్య పరమసుఖదా! సత్ప్రేమాకర శుభదా!
30. మలయాళ గురవరేణ్యా! మహనీయ విబుధగణ్యా!

## శ్రీ మలయాళ స్వాములవారి సదుపదేశములు

విద్యా తపోభ్యాం పూతాత్మా।
తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృత మశ్నుతే
స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యం।
అహింసా పరమో ధర్మః॥

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభిః।

1. జీవితమంతయు నియమబద్ధమై జరుపవలయునని దృఢ సంకల్పము గలుగు దశనుండియే మానవత్వము ప్రారంభ మగుచుండును. ఏలన, నియమములు మానవులకుగదా యేర్పడియున్నవి! మృగములకు కాదుగదా! ఇట్టి

ప్రయత్నము అంతరాత్మయందు యెంతవఱకు గలుగ లేదో, అంతవఱకు అతడు యెన్ని విద్యలను నేర్చినను మృగావస్థ యందుండువాడే యగును. ఇది యెంతకెంత తీవ్రముగా పరిణమించునో, అంతకంతకు పరిశుద్ధాత్ముడై యీశ్వర సమీపమున చేరుచుండును.

2. ఆత్మ నియమము కావలయునా?
   ఆహార నియమము నవలంబించవలయును.

3. నిశ్చల ధ్యానము కావలయునా?
   నిర్మల భక్తిలో మునుగవలయును.

4. అగాధ నిష్ఠలో ప్రవేశింపవలెనా?
   అఖండ జ్ఞానము కలుగవలయును.

5. సోహం భావ ముదయించవలయునా?
   అహంభావము నశించవలయును.

6. నిర్వికల్ప సమాధి గలుగవలయునా?
   సవికల్పము క్షయించవలయును.

7. సత్య జీవితము గడుపవలయునా?
   అసత్యలోకమును తృణీకరించవలయును.

8. పరమశాంతిలో జీవించవలయునా?
   అశాశ్వతమును విడువవలయును.

9. కరుణామృతములో బ్రదుకవలయునా?
   కారుణ్యము నవలంబించవలయును.

10. విరక్తులై యుండవలయునా?
    సంస్కారము నొందవలయును.

11. దైవప్రేమ కావలయునా?
 లోకమును ప్రేమించవలయును.

12. దైవత్వము నొందవలయునా?
 దైవమయమై యుండవలయును.

13. సాధించవలయునా?
 సాధనలో నమరవలయును.

14. వృత్తులనెడు బీజములను దహింపజేయుటలో ప్రాణాయామమనెడు అగ్నికి సమానమైనది మరియొండు లేదు.

15. మనస్సనెడు మాయాతమస్సును నశింపజేయుటలో ఆత్మజ్ఞానైకబోధ యనెడు భాస్కరోదయమునకు సదృశమైనది మరియొకటి లేదు.

16. అహంకారమనెడు రాక్షసుని సంహరించుటలో నిర్మల భక్తియనెడు భగవంతునికి సదృశము యింకొక్కటి యుండబోదు.

17. భేదమనెడు బాధను తొలగించుటలో కరుణ యనెడు దివ్యరసాయనామృతమునకు సమానమైనది మరియొండు లేదు.

18. సంసారమనెడు మాయాపాశమును ఛేదించుటలో వైరాగ్యమనెడు వజ్రాయుధమునకు సరియైనది మరియొండు లేదు.

19. ప్రసన్నమైన నిత్య సంతోషమును గలుగజేయుటలో శాంతమనస్సనెడు చంద్రోదయమునకు సాటైనది వేరొకటి యుండబోదు.

20. నియమనిష్ఠ లన్నిటిలోను సంయమమునకు సమానమైనది మరియొకటి యుండజాలదు.

21. ఇంద్రియము లనెడు మృగములను నిగ్రహించుటలో వ్రతానుష్ఠాన మనెడు సింహామునకు సమానమైనది మరి యొకటి లేదు.

22. తత్త్వబోధయనెడి దివ్యజ్యోతిని స్థిరముగా నిలుపుటలో బ్రహ్మచర్యమనెడి తైలమునకు సదృశమైనది మరియొ కటి లేదు.

23. నిర్భయుడై వెలుగవలసియుండిన సత్యనిష్ఠకు సమాన మైన ఏకచక్రాధిపత్యము మరియొకటిలేదు.

24. ద్వైతము నశించి అద్వైతప్రభువై ప్రకాశించవలసి యుండిన దైవత్వము నొందుట తప్ప మరియొక యుపా యము లేదు.

25. సర్వత్ర విజయము నొంది నిశ్శ్రేయస్సు నొందవలసి యుండిన నియమిత కృత్యమును నిశ్చితకాలములో చేయుటకన్న గత్యంతరము మరియొకటిలేదు.

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు. ఓం శాంతిః శాంతిః శాంతిః.

## దైవప్రార్థన

ఓ దయామయుఁడవగు సర్వేశ్వరా! మా వాక్కు చేతను, మనస్సుచేతను, కాయముచేతను, ఏవిధమైన క్లేశ మున్ను యితర ప్రాణికి గలుగనీయక సదా యుండులాగున అనుగ్రహింపుము.

ఓ కారుణ్యైకసింధో! మా వాక్కుచేతను, మనస్సు చేతను, కాయముతోఁగూడిన క్రియలచేతను, సర్వకాల సర్వావస్థలయందును, ప్రపంచములోఁగల సకల ప్రాణికోట్లకు ఉపకారము చేయునట్లు ఆశీర్వదింపుము.

ఓ జ్ఞానైకమూర్తీ! పరమేశ్వరా! మాయందు జాగ్రదవస్థయందుగాని, స్వప్నావస్థయందుగాని, సుషుప్త్యవస్థయందుగాని, ఈ మూడింటికి హేతువులైన స్థూల సూక్ష్మ కారణ శరీరములలోఁగాని, ఏలాటి విషయదోషములున్ను, చెడు సంకల్పములున్ను కలుగనట్లు కరుణించుము.

ఓ శాన్తినిలయా! పరమపావన పుణ్యమూర్తీ! మాపై యెవరైన నిందలు మోపినను, మాకపకారమొనర్చినను, మమ్ము నిరుత్సాహపరచినను, వాటినన్నిటిని సహించుకొని వారి దుష్కృత్యములను క్షమించి మానిశ్చయ దైవకార్యమగు లక్ష్యమునుండి, మనస్సును కొంచెమైనను చలింపనీయక సదా యుండునట్లనుగ్రహింపుము.

—వ్యాసాశ్రమమువారి "స్తోత్రమంజరి" నుండి

## భగవద్దర్శనమునకై ప్రార్థన

రచన : శ్రీ శివానందస్వామిజీ (హృషీకేశం)

ఓ కరుణాపూర్ణప్రభూ! కాలము పరుగిడుచున్నది. ఇంద్రియములు తిరుగుబాటొనర్చుచున్నవి. మనస్సు దుముకుచున్నది. మాయ, మోహము నొందించుచున్నది. తాపత్రయాగ్నులు కాల్చివేయుచున్నవి. మిత్రులు లలజడి చేయుచున్నారు. రోగములు నొప్పించుచున్నవి. పంచక్లేశములు బాధించుచున్నవి. వేసవికాలపు వేడిమి తాపము నొందించు

చున్నది. ఈగలు, దోమలు, నల్లులు, తేళ్ళు నన్నమిత ముగా గాసి జెందించుచున్నవి. ప్రపంచపు సౌందర్యములు భ్రమింపజేయుచున్నవి. నేను ధారణ నొనర్చుటగాని, ధ్యానించుటగాని చేయలేను. నీయొక్క కరుణా కటాక్షములేనిదే ఆధ్యాత్మిక పంథాలో నేనొక్క యడుగైనను వేయజాలను. ఓస్వామీ! నీవు కరుణా సముద్రుడవు. నన్నాశీర్వదింపుము. ఆ కరుణాసముద్రమునుండి నేనొక బిందువును బొందినచో నది యెండిపోవునా?

ఓ పూజ్య పురాణపురుషా! జనులు నిన్ను దీనబంధూ! దీననాథ! కృపానిధాన! కృపాసాగర! అనాథ రక్షక! అని చాటుదురు. నీవు అహల్యను, ద్రౌపదిని, ప్రహ్లాదుని, ధ్రువుని, గజేంద్రుని కాపాడితివి కాని నా విషయములో నీవేమియు చేయలేదు. నేనింకను బాధ, ఆవేదన, అంధకారములలో నున్నాను. నేను నీ కృపకు, సహాయమునకు యెదురు చూచుచున్నాను. ఈ చర్మచక్షువులకు గోచరముకాని ఓ సర్వేశ్వరా! నీవెక్కడకు జనియుంటివి? ఓ స్వయం ప్రకాశమానమగు భగవంతుడా! చేప నీరులేనిదే జీవింపజాలదు. పతివ్రత భర్తలేనిదే మనజాలదు. మనస్సు ప్రాణములేనిదే యునికిని వహింపఁజాలదు. దీపపుజ్యోతి నూనె లేనిదే యుండజాలదు. అట్లే నీవు లేక నేను నిలువజాలను. ఓ పరమేశ్వరా! రా, రమ్ము. నా హృదయములో నాసీనుడవుకమ్ము. నీవు నా ప్రాణములలో ప్రాణమవు. నీవు నాయాత్మలో నాత్మవు. నిన్ను ప్రార్థించెదను. నన్నాశీర్వదింపుము. నాకు దివ్యదర్శన మిమ్ము. నే నీ విరహబాధ నెంతవరకు సహింపఁగలను?

## సంసార మసత్యమని గుర్తించుటకు దృష్టాంతము

భ జ న బా బు

ఒకానొక గంధర్వ నగరమును వంధ్యాపుత్రుడు పరి పాలించుచుండెను. గంధర్వనగరమన ఆకాశమునందలి మేఘముల సమూహము పెద్దపెద్ద మేడలరూపమున గాన్పించి అది యొక పట్టణముగా దోచును. దానినే గంధర్వనగరమనె దరు. వంధ్యాపుత్రుడన గొడ్డురాలి కొడుకని యర్థము. గొడ్డురాలికి కొడుకు ఉండడుగదా? అతను శుక్తిరజతమను చెంబును దీసికొని యెండమావుల నీళ్లలో స్నానము జేయు కొఱకు వెళ్లుచుండెను. శుక్తి రజతము అనగా ముత్యపు చిప్ప తెల్లగా తళతళ మెరయుటవలన అది వెండిగా భ్రాంతి దృష్టికి గాన్పించును. అదియే శుక్తి రజతము. దారిలో రజ్జు సర్పము కరచెను. రజ్జు సర్పమనగా తాడు పాముగా గాన్పిం చును. అదియే రజ్జు సర్పము. ఆ కరచిన కాటుకు కుందేటి కొమ్ము గంధముబెట్టి మాన్పుకొనుట యెంత నిజమో ఈ సంసారముకూడ అంతే సత్యమని నమ్మవలయును. కుందేటి కొమ్ము అనగా కుందేటికొమ్ము యుండదు.

ఇట్టి అసత్యమగు సంసారమునందుండి తరించు మార్గమేది యనగా దేనియందును గాఢాభిమానమును వహిం పక సత్యమగు పరమాత్మనే స్మరించుచు, శరీరము నిలుపు కొనుటకు దగిన పాపములేని పనులను జేయుచు, నాట్యరంగ మునందు నటునివలె చరించవలెను. అప్పుడే సంసారమునం దుండి తరించుటకు వీలుపడును.



ఓమ్

# దైవప్రార్థన-కీర్తనలు

## ధ్యానము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

శ్లో॥ హే గోపాలక హే కృపాజలనిధే హే సింధుకన్యాపతే
హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ।
హే రామానుజ హే జగత్త్రయగురో
హే పుండరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం
జానామి న త్వాం వినా॥

శ్లో॥ శ్రీమన్మహేశ్వర కృపామయ హే దయాళో
హే వ్యోమకేశ శితికంఠ గణాధినాథ ।
హే విశ్వవంద్య మదనాంతక దీనబంధో
సంసారదుఃఖగహనాజ్జగదీశ రక్ష ॥

## హరే రామ సంకీర్తన

పల్లవి :

హరేరామ! హరేరామ! రామరామ హరేహరే!
హరేకృష్ణ! హరేకృష్ణ! కృష్ణకృష్ణ హరేహరే!

1. నిర్దోషంబగు కర్మాచరణము, నిశ్చలభక్తిలో తన్మయ భావము
నిస్సంకల్పిత ధ్యాన విధానము,
నిఖిలాధీశ్వర ప్రసాదించర ॥హరే॥

2. అనవరతము నీ నామము తలచుచు, ఆత్మలోన నీ మూర్తిని నిల్పుచు
సర్వజీవులను దైవరూపమున,
ఆరాధించెడు దశనొసంగరా ॥హరే॥

3. ధర్మపథంబున జీవిత రథమును, ధైర్యమూని నే నడుప బూనితి
కర్మాధీశ్వర! ఇంద్రియాశ్వముల
క్రమమార్గంబున నడిపింపుమురా ॥హరే॥

4. సత్యము, శాంతము, సహనము, శీలము,
సమతాభావము, సహజవిరాగము

సంకటములలో సౌమ్యవిధానము,
సర్వాధీశ్వర దయచేయుమురా ॥హరే॥

5. నీవే తల్లివి, నీవే తండ్రివి,
నీవే గురుడవు, నీవే దైవము
నీవుతప్ప నాకితరములేదని, నిన్నే నమ్మితి
నన్ను బ్రోవరా ! ॥హరే॥

6. నిఖిల సంపదల నొల్ల నో హరి,
నీదగు దైవీ సంపద గోరెద
భజనబాబు నీ నామ మహిమచే
సఫలత నొందగ ప్రసాదించరా ॥హరే॥

## విఘ్నేశ్వర ప్రార్థన

శ్రీ గణనాయక నమో నమో—సిద్ధివినాయక నమో నమో
నాగవిభూషణ నమో నమో—నవ్యసుభాషణ నమో నమో
పార్వతీనందన నమో నమో—పాపనికృంతన నమో నమో
సర్వజనస్తుత నమో నమో—సర్వశుభప్రద నమో నమో

## సాముదాయిక భగవత్ప్రార్థన

౧ ఓమ్ ఓమ్ ఓమ్

౨. (1) ఓం నమః శివాయ (6 సారులు)
(2) ఓం నమో నారాయణాయ (6 సారులు)
(3) ఓం నమో భగవతే వాసుదేవాయ (6 సారులు)
(4) శ్రీరామ జయరామ జయజయరామ (6 సారులు)

3. హరేరామ హరేరామ రామ రామ హరే హరే !
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥ ( ,, )

# భగవన్నామ సంకీర్తన

శ్రీకృష్ణానంద ముకుంద మురారే వామన మాధవ గోవింద
శ్రీధర కేశవ రాఘవ విష్ణో లక్ష్మీనాయక నరసింహా.

గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద రథాంగపాణే
గోవింద గోవింద ముకుంద కృష్ణ
గోవింద గోవింద నమో నమస్తే.

నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వమవ్యయమ్.

చింతయామి హరిమేవ సంతతం
మందమంద హసితాననాంబుజమ్
నందగోప తనయం పరాత్పరం
నారదాది మునిబృంద వందితమ్
శ్రీకృష్ణ గోవింద హరే మురారే
హేనాథ నారాయణ వాసుదేవ.

రామ రామ రామ రామ రామనామతారకం
రామ కృష్ణ వాసుదేవ భక్తిముక్తి దాయకమ్ ॥
జానకీమనోహరం సకలలోక నాయకం
శంకరాది సేవ్య మాన దివ్యనామ కీర్తనమ్.

శ్రీకృష్ణ చైతన్య ప్రభు నిత్యానంద
హరే రామ హరే కృష్ణ రాధే గోవింద.

నామస్మరణా ధన్యోపాయం—నహి పశ్యామో భవతరణే
రామ హరే కృష్ణహరే—తవ నామ వదామి సదానృహరే.
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమామ్
చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర రక్ష మామ్.
శంభో శంకర గౌరీనాథ సాంబసదాశివ సర్వేశ
చంద్రచూడ గంగాధర పురహర సర్పవిభూష శ్రీగిరీశ.
రఘుపతి రాఘవ రాజారామ్ పతితపావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరేనామ్ సబ్ కో సన్మతి దే భగవాన్.
సుందర మాధవ మేఘశ్యాం గంగాతులసీ సాలగ్రాం
చండకిరణ కులమండన రాం శుద్ధ బ్రహ్మ పరాత్పర రాం
భద్రగిరీశా సీతారాం భక్తవత్సలా సీతారాం.



భక్త లక్షణములు (కీర్తన)

1. పరోపకారీ భక్తుండెవడో వాడే నిజముగ వైష్ణవుడూ
మేలుంజేసియు నేజేసితినని మిగులుగ బల్కని వాడెవడో॥

2 సర్వప్రపంచపు మానవకోటికి సాష్టాంగముగా దండమిడి
నిందలజేయక తను మనుభాషల నిశ్చలుడైనావాడెవడో॥ప

3. సర్వజీవముల నెల్లవేళల తన సమానముగ మదిలో నెంచి
పరధన పరస్త్రీ దూరత సత్యము వెరువక బల్కెడు
వాడెవడో ॥ప॥

4. మాయల జేయక మోహము నొందక మదిలో వైరాగ్య
ముబూనీ। రాముని నామము చెవి బడినంతనె రంజిలు
మది గల వాడెవడో ॥ప॥

5. కామ క్రోధ లోభ మాదిగాగల శత్రువులను బరిమార్చి ఘనుడౌ భక్తుడె పూజ్యుడు వానిని గన్న తరింతురు యీ ధరణిక ॥ప॥

6. గాంధిమహాత్ముడు జైలునకేగుచు గానము జేసిన గేయ మిది । గాంధిమహాత్ముని శిష్యులపాలిటి కల్పవృక్షమై తనరు నిదీ ॥ప॥

— శ్రీ నరసింహ మెహతా గారి - వైష్ణవ జనతో - అను కీర్తనకు సాయంవరదదాసుగారి తెలుగు సేత.

## కీర్తన

"నందామయా గురుడ" అను వరుస

1. ఉన్నాడయా దేవు డున్నాడయా
కన్నులకు కనుపించ కున్నాడయా
కనుపించ కేమి చేస్తున్నాడయా ॥ఉ॥

2. లోకాల చీకట్లు బోకార్ప రవిచంద్ర
దీపాలు గగనాన త్రిప్పేడయా
లక్షలాదిగ నున్న నక్షత్రముల నెల్ల
నేల రాల్చక మింట నిలిపేడయా ॥ఉ॥

3. ఈ ధారుణీచక్ర మిరుసు లేకుండగా
ఎల్లవేళల త్రిప్పు చున్నాడయా
జీతబత్తెము లేక ప్రీతితో మనకెపుడు
గాలికై సురటీలు కదిపేడయా ॥ఉ॥

4. ఆధారమే లేక యలరారు చున్నట్టి
ఆకాశమును ఆపు చున్నాడయా

పొంగిపొరలుచు వచ్చి పృథివిపై బడకుండ
కడలిరాయుని కాళ్లు ముడిచేడయా ॥ ఉ॥

5. విందుకై భక్తవరు లెందరో వేడగా
హృదయాంగణములకే కదిలేడయా
తెర వెనుక తానుండి తెరముందు ప్రజనుంచి
తైతక్క లాడించు చున్నాడయా ॥ ఉ॥

6. జగతిలో జన్మించు జీవకోటులకెల్ల
యాహారమిడి యాదరించేడయా
సుమహారమందు దారమువలెనుండి మన
యాత్మయై యలరారుచున్నాడయా ॥ ఉ॥

శ్లో॥ శుద్ధోసి బుద్ధోసి నిరంజనోసి సంసారమాయా పరివర్జితోసి
సంసార స్వప్నాం త్యజమోహ నిద్రాం మదాలసా పుత్రి
ముపాచ వాక్యం ॥

## శ్రీ మదాలస జోలపాట - కీర్తన

పల్లవి॥ లాలి ప్రత్యగ్రూప లాలి సద్రూప,
లాలి భూమానందా లసదాత్మచందా ॥లాలి॥

1. జల బుద్బుదములనుగను జగములనుకొమ్మా -
మలమూత్ర కొంపలకూ మరలిరాకమ్మా ॥లాలి॥

2. సంసారమిది దీర్ఘ స్వప్నమని నమ్మా -
ఆభాస సౌఖ్యమ్ములను విడచిపొమ్మా ॥లాలి॥

3. రేయిబవలును మేము హాయి లేకుండా
మాయలో మునిగితిమి మరి తెలియకుండా॥లాలి॥

4॥ దేహాత్మబుద్ధిచే దిగులొందనేలా -
మోహానిద్రనువీడి ముదమొందవేలా ॥లాలి॥

# గురు స్తోత్రం - కీర్తన

జయ గురు జయ గురు – మలయాళ సద్గురు!

1. అమృత అమరగురు – అజ్ఞాన హర గురు
2. భవభయ హర గురు – పరమానంద గురు
3. పుణ్య స్వరూప గురు – భువనా వన గురు
4. జ్ఞాన విజ్ఞాన గురు – ధ్యాన నిమగ్న గురు
5. కారుణ్య పూర్ణ గురు – కామవిదూర గురు
6. ప్రణవ స్వరూపగురు – బ్రహ్మానంద గురు
7. అఖిలోపద్రష్ట గురు – అసంగానంద గురు
8. భజనబాబు నుత – భవ్య చరిత్ర గురు

## కీర్తన - ఆటతాళం

1. శ్రీ సద్గురూత్తముల। చిత్తంబులో నిల్పి
సేవింపుచుండవే మనసా। వాసిమీరగ గురుని
దాస్యంబుచే పరమ వైరాగ్య ధనమబ్బు మనసా॥ శ్రీసద్గు॥

2. వైరాగ్య ధన మెంత। వారికైనను నిలువ వశము గాదే
వెఱ్ఱిమనసా। వారాసియైన సంసారంబు దాటింప।
వైరాగ్యమే నావ మనసా ॥ శ్రీ సద్గు॥

3. లోకవాసన దగిలి। చీకాకు పడుచుంటె నీకేమి లాభమే
మనసా। ఏకాంత స్థలమునకు నేగి సుస్థిరమైన లోకేశు
బొగడవే మనసా ॥ శ్రీ సద్గు॥

4. సాకారమును కొంత। సాధింపవే ముందు
సద్గురుని కృపచేత మనసా। సాకారమును మీరి
సర్వంబు నీవై నిరాకార మొందెదవె మనసా॥ శ్రీ సద్గు॥

5. దయసత్యశౌచములు । దండిగా లేకున్న జయమేమి గలు
గునే మనసా । భయము భక్తియు లేక భజియింపుచుండిన
ఫలము యించుక లేదు మనసా ॥శ్రీ సద్గు॥
6. పరదారధనములకు పాల్పడుచు । దురితమౌ బాట నడు
వకె వెఱ్ఱిమనసా । తరియించుటకు మంచి దారి కాదదియు
పరితాపంబు నొందవే మనసా ॥శ్రీ సద్గు॥
7. కొంద రీమహిలోన । కోర్కెలన్నియు దీర్చుకొనుటె
ముఖ్యంబనుచు మనసా । మందమతులై పాప
మొందితుచ్ఛపుజన్మలందు జిక్కెదరె వెఱ్ఱిమనసా॥శ్రీసద్గు॥
8. శ్రీ సద్గురుడె మాయపాశంబు । వదలించి శీఘ్రముగ కడ
తేర్చు మనసా । వాసవబ్రహ్మ శివ కేశవుల కైనను
వశము గాదని యెరుగు మనసా ॥శ్రీ సద్గు॥

## కీర్తన - ఆదితాళము

ప. సాక్షియె సద్గురుడూ – నీలో సాక్షిని గనరయ్యా॥
1. ఎంత చదివినా ఎంత నేర్చినా సుంతసాక్షి కరుణా లేనిదే
అంతయునూ సున్నా॥ ॥సాక్షి॥
2. తప్పులు సేయకుడీ చేసిన శిక్షించును సాక్షి – సాక్షి మా
త్రుడై సర్వేశ్వరుడు సకలమునందు వసించు నట్టి యూ –
సాక్షియె సద్గురుడూ మీలో సాక్షిని గనరయ్యా ॥సాక్షి॥
3. సాక్షియె బ్రహ్మ, సాక్షియె విష్ణువు, సాక్షియె దేవుం
డీశ్వరుండును సాక్షియె సాక్షాత్ పరబ్రహ్మము ॥సాక్షి॥
4. వ్యాసాశ్రమమున, భజనబాబు ఇట సద్గురుమూర్తిని
గొలిచినట్టి యూ, సాక్షియే సద్గురుడూ మీలో సాక్షిని
గనరయ్యా ॥సాక్షి॥

## రామనామ మంత్రం - శంకరాభరణము - ఆది

కలికల్మష నాశన మంత్రం। శ్రీరామనామ మంత్రం

1. కలికి భిక్షమను। కామక్రోధముల। కాలచక్రమునజిక్కి।
స్రుక్కి కష్టమొందనేల? మానవ! కష్టమందనేలా? నారదాది మహామునీంద్రులు నమ్మి తరించిన రామనామం ॥కలికల్మష॥

2. మానసమున మహిలోనికలిమి బహుభోగములను శాశ్వతమనితలచి మహిత నరకముల బడనేలా? నరుడా! మహిత నరకముల బడనేలా? ధ్యానగమ్య పద ధ్యాన మొనర్చి ధన్యత నొందగలేవా? నరుడా! ॥ కలికల్మష ॥

3. వలచిన దలచిన గొలచిన భవభయము బాపి దగ ధన్యత గూర్చును ॥కలికల్మష॥

4. అక్షయమని మలయాళమహర్షి యొసగిచ్చిన మహా మంత్రం బిదే సాక్షిసాధు శ్రీభజనబాబు సతతము స్మరణము జేసెడి మంత్రం ॥కలికల్మష॥

## కృష్ణ సంకీర్తన - మోహన - చతు - ఆది

కృష్ణ కృష్ణ కృష్ణా యను మనసా అన్యచింత నీ కెందుకే మనసా ॥కృష్ణ॥

1. హెచ్చుగ ద్రవ్యము మోసకృత్యముగ నెంత కూడబెట్టిన నెప్పుడైననువచ్చు మృత్యు వేకృతముగనైనను వలదన బోవదు వారింపగ నెటు ॥కృష్ణ॥

2. తుచ్ఛ సుఖంబుల కాశించియు నీ యిచ్ఛవచ్చినటు తిరుగకే మనసా అచ్ఛముగ దూరము నాలోచింపగ నస్వతంత్రపు బ్రతుకిది మనసా ॥కృష్ణ॥

నిరతము కృష్ణుని స్మరియించిన మది నీకు యముని బాధ
లెపుడు గలుగవు నిరంతరము సత్యము వచించుమా నీ
కష్టార్జితమే భుజించుమా పరుల నెపుడు దూషణ సేయ
కుమా పాటుబడుమా దేవదేవు కృపకై ॥కృష్ణ॥
వినయమునుంచుమా పెద్దల బాడ గని విశ్వామయుని కథ
లాకర్ణించుమా నినుగని కాలుడు ఘనముగ బెదరును నీ
నీతికి హరి సంతోషించును ॥కృష్ణ॥
భక్తుల వచనాలే తిరుమంత్రంబుగ బాలించుమా శ్రీ
సాధు వచనముల బాగుగా నమ్మి సాధువచనముల భజన
బాబు వచనంబులే స్థిరముగ ॥కృష్ణ॥

'ఏరువాక' మాదిరి

1. భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న!
నీ పాపములే బాయునురో రన్నో పెద్దన్న!
॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

2. చీకటితో లేచి స్నానముచేసి
నీతోటి వారినె తొందరలేపి
గీతాబైండు చేతబట్టుకొని
మనసునే కేంద్రీకరించుకొని
మందిరమునకు సాగుమురో రన్నో చిన్నన్న!
నీకు ముక్తిమార్గము దొరకునురో రన్నో పెద్దన్న!
॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

3. జై భగవద్గీతాగానము పావనగంగాస్నానము
కృష్ణధ్యానము చాలునురా
పాతకులను దండించు యముడు నీప్రక్కచూడ

భయమొందునురా ! నీప్రక్క చూడ భయ
మొందునురా !

॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

4. సర్వమతంబుల సారంబిదియని
స్పష్టముగా మీ రెరుగండీ !
నీయందును నాయందును కృష్ణుడె
నిండి వెలుంగుచు నుండునురా !
మాయచేత నను కోపింతువు
పరమాత్మవంచు నిన్నెరుగుమురా !

॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

5. సంసారసాగరమున కిది నావా
కామక్రోధముల నణచివేయురా
ముక్తిమార్గమునకే బాటవేయురా
శాంతిసమతల కాటపట్టురా
నిత్యగానము నిలుపకురో రన్నో చిన్నన్న !
నీ పాపములే బాయునురో రన్నో పెద్దన్న!

॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

6. వినయముంచుమా పెద్దలపొడగని
విశ్వమయునికథ భగవద్గీతా
నిను గనుకాలుడు ఘనముగ బెదరును
నీ నీతికి హరి సంతోషించును.

॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

7. భగవద్గీతను ఉచ్చరించిననే
గీతను మదిలో ధ్యానించిననే
గీతాశ్రవణము వినుచుండిననే

గీతాశ్లోకాల్ పఠియించిననే
పవిత్రుడా వగుదువురో రన్నో చిన్నన్న
నీ పాపమూలే బాయునురో రన్నో పెద్దన్న
॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

8. సాధులవచనమె తిరుమంత్రంబుగ
పాలించినచో భయము తీరును
భజనబాబు వచనంబులె స్థిరమని
భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న
నీకు ముక్తిమార్గము దొరకునురో రన్నో పెద్దన్న
॥భగవద్గీతా చదువుమురో రన్నో చిన్నన్న॥

## కీర్తన

భగవద్గీతండోయి బాబు! పఠన చేయండోయ్ బాబు! పఠన చేయండోయి!

1. రాజకీయ వ్యవహారులకైనను, పూజచేయు హరిభక్తులకైనను ప్రతిబంధమ్ములు భంగపఱచుటకు తేటగ ధర్మము తెలిపెడి శాస్త్రము ॥ భ ॥

2. కాంక్షవీడి బహుకర్మలచేసిన పట్టుబడవు భవబంధములని గట్టిగ బోధలుచేసి యర్జునుని కౌశలకర్ముని కృష్ణుడు చేసిన ॥ భ ॥

3. యుద్ధభూమిలో పార్థుడు భ్రాంతిని శోకయుతుండై సోలుచునుండగ దుఃఖభారమును దూరముచేయగ చక్కగ తెల్పెను సర్వాత్ముడు హరి! ॥ భ ॥

4. ఏ జను లీలలో పాయక మనమున నిరతము నను భజియించిన, సతతము ననుస్మరణ చేసిన వారి యోగక్షేమము లరయుదు ననె హరి !

5. సర్వధర్మములు వదలుము నన్నే శరణుబొందుము సర్వపాపముల బాపెద దుఃఖము బాయు మటంచును చెప్పెను కృష్ణుడు చివరకు ప్రీతిని ॥ భ ॥

6. సర్వశాస్త్రముల సారం బీయది నిఖలభాషల నలరు చున్నది నిఖలదేశములవారలు నిత్యము శ్రద్ధాభక్తుల చదువుదు దీనిని ॥ భ ॥

1. భక్తులారా! ఆ భగవంతుండల ! భగవద్గీతలో కలడండీ !
ముక్తినొసంగగ ముఖ్యగ్రంథమిది । మోదముతో
పఠియించండీ ॥ భ ॥

2. విషాదమేలా? విను మర్జునయని । విన్నవించినది గీతండీ
విశదముగా నీ గీతను జదివిన। వశమగు కృష్ణుడు మీకండీ !
॥ భ ॥

3. జైలులోన ఆ గాంధి మహాత్ముడు। చదివియున్నదీ గీతండీ।
జయము నిశ్చయము జాగేలను మీ । జన్మతరించును
రారండీ ॥ భ ॥

4. భజనబాబు మనశ్శాంతి కొఱకు కై । పఠియించినదీగీతండీ
ప్రజలారా ! యీ పావనగీతను । పారాయణమును
జేయండీ ॥ భ ॥

## సమదృష్టి - కీర్తన

1. అల్లా క్రీస్తు హరి శివుడన్నా అందరు తలచగ ఒకటేగా

యిలలో బైబులు వేద ఖురానులు అంతయు ధర్మం నొకటేగా

2. కుల మత భేదం కుజనులవాదం కోర్కె నశించని పెడ వాదం, తలచగ వేదం ధర్మ నినాదం ధరలో స్వార్థుల కిది మోసం. ।అల్లా।

3. శుక్ల శోణితము కలియక లేగద చూడగ మానవజన్మంబు రక్త మాంసములె యీశరీరములు రాదుగ క్షీరం బెవరికిని

4. తలయొక కులమని తలయొక మతమని తలచెద రెంతటి అజ్ఞానం లయ సృష్టి స్థితి కారకుడొక్కడే బయులే అతని నిలయంబు ।అల్లా।

5. కుల మన నలుపో, తెలుపో, యెరుపో కోవిదు లెంతయు నరయరయా, చులకన జేతురు స్వార్థ డాంబికులు చిల్లర లోకుల కులములని పంచభూత నిర్మాణమె కద ప్రకృతి శోభయు నంతయును, యెంచిచూడ పరమాత్మ స్వరూపము అంతయు తానై యుండెనుగా. ।అల్లా।

6. కులమత మెంచక కోరిక పెంచక కూడినదేగద పరతత్వం పలుకుల సత్యం ప్రకృతి నిత్యం బని తలచుటయె మన లక్ష్యం ॥అల్లా క్రీస్తు॥

## కీర్తన

అన్నలార! వినరయ్యా! పరమాత్మస్వరూపులమయ్య ఓ॥ అన్న॥

2. ఆత్మ నెవడు నడయింప జాలడది
శస్త్రాస్త్రములచే జావగ బోదది
యింద్రియములచే నెరుగ నేరదది
యెంచి చూడ సర్వంబును నదియె ఓ॥ అన్న॥

3. ఆత్మ దేహమని యెంచితేని మది
యెన్నడైన నశియించు నిక్కమిది
స్వాత్మనెరిగితేనియు భీతిల్లుచు
సాక్షి సుక్షి నశియింపగనేలను ఓ॥అన్న॥
4. ప్రాత వస్త్రమును వీడియు వేరొక
క్రొత్తవస్త్రమును చేకొను భంగిని
దేహి దేహమును వీడియు నింకొక
దేహాంతర్గతుడై చరియించును. ఓ॥అన్న॥

## కీర్తన - తత్త్వము

1. జ్ఞానిదృష్టికి సులభుడగుచుండు, సర్వేశ్వరుండజ్ఞాని దృష్టికి దూరముగనుండు, ఇతడు బ్రాహ్మణు, డితడు శూద్రుండనుచు, భేదము మదిని విడచియు, సర్వసముడై సతతమాత్మానందయుతుడగు ॥జ్ఞానిదృష్టికి॥
2. కష్టసుఖములు, లాభనష్టము లిష్టముగ, తాననుభవించుచు, తృప్తిజెందియు జీవనంబును సృష్టికర్తకు విడచిపెట్టిన ॥జ్ఞానిదృష్టికి॥
3. లోక మంతట దేవుడుండెను, లోక మాతనిలోననున్నది, లోకమే హరిరూప మనుచును, లోన ఆతని తత్త్వమెరిగిన ॥జ్ఞానిదృష్టికి॥

## కీర్తన - బేగడరాగము - చాపుతాళము

1. దానధర్మమే దైవలక్షణం, సచ్చిదానందమే బ్రహ్మ లక్షణం, దానధర్మమువలన జ్ఞానోదయంబగును, జ్ఞానంబుచే సచ్చిదానందమే యగును ॥దాన॥

2. దానంబు నిష్కామమైనా, నిరభిమానంబు మమ తల నణచును, ఆత్మజ్ఞానంబు బుద్ధిలో బొడమును, గాన సర్వము తానే యను బోధకలుగును, దానమిచ్చెడు వారు కొనువారు తానగును ॥దాన॥

3. పుణ్యమని దానంబు జేసీ, తిరిగి తగు భోగముల గోరు మనుజుడు, యెప్పుడు తగదు దానము జేయ ఫలముకై, ఈగి మా నెపుడయిన ఈగిఫలమడుగునా, భగవత్సంతానంబు పంచి కుడుచుటె పాడి ॥దాన॥

## కీర్తన

'మనసే మాయ' మాదిరి

1. ఘంటాపథముగ చాటుదు వినుడీ ఒంటిగ నంతట నుండిన సుండీ కంటికి కన్నయి మింటికి మిన్నయి అంటియునంటక యుంటిని సుండి!

2. మనసేమాయ మాయేమనసు, మనసువినాగా మాయ లేదు మనసును మనుపుచు ఘనముగ ననయము పైన వెలింగెడు వెలుగే నేను.

3. నవ నవ రూపులు నామంబులతో, భువనము లన్నియు, మాయావేషం భవనాటకమును భక్తియు రక్తియు భవ మోక్షంబును మాయాలోపం.

4. సేవకుండను దేవాబుద్ధిని జీవబుద్ధిని నీ యంశకుడను నీవె నేను ఆత్మబుద్ధిని దేవదేవయని భక్తులు గొల్తురు.

5. మాటిమాటికి నేను నాదని కోటుల కొలదిగ నాటలాడెడి నాటకమిదియని నేటికి నెరిగితి కూటస్థుడనై ప్రాపుగనిల్చితి.

6. యతి జితేంద్రియము యతిమననంబును సతతముబూనుచు సంతోషముతో మతిసుస్థిరమగు స్థితిలోనుంచిన నతి యా నందము యదియే వెడలును.

కీర్తన

'చల్లని రాజా' వలె

శ్రీరఘురామ లోకాభిరామ శ్రీకళ్యాణగుణధామ
కాపాడరావా సీతారామ ॥శ్రీ॥

పరమేశుని హృదిలోన నివసింతువు పాపాత్ములనైన
పరిపాలింతువు, నిను సేవించెద నను దయచూడవ
నీ దాసుని మొరవిని దరిజేర్చవ ॥శ్రీ॥

దీనజనులను బ్రోచే దొరనీవని నిను నమ్మిననాపై
చలమేలర, మొర నాలించరా నను పాలించర
జాగుచేయక నీదయ చూపించర ॥శ్రీ॥

నిను పిలిచిన పలుకవు మాటాడవు పసివాడను
రసికుడ, పామరుడను, నన్ను కరుణింపగా నా
దరిచేరగా దయచేయరా దశరథ ప్రియనందన! ॥శ్రీ॥

'నందామయా-గురుడ!' మాదిరి

ఉన్నాడయా దేవు డున్నాడయా
కన్నవారికి దగ్గఱున్నాడయా
కనలేని వారి కతి దూఱుండయా ॥ఉ॥

1. సర్వాంతరాత్ముడై సత్తా స్వరూపమున
సర్వమును నడిపించు చున్నాడయా
నిర్వికల్పాత్మ నొకసారైన తెలిసిన
జన్మాదులకు బోవ పనిలేదయా ॥ఉ॥

2. ధరలోన మనుజుడై జన్మించి నందుకు
తన్నుదా గని మోదమందాలయా
హరిహరాదులగాంచి ఆనంద మొందంగ
దురితములు బాసి కడతేరాలయా ‖ఉ‖

3. శుద్ధ పరమాత్మయే బుద్ధి వృత్తినిగూడి
జీవుడని పిలువబడు చున్నాడయా
బుద్ధ్యుపాధిని దీసి శుద్ధాత్ములై ధరను
సిద్ధులై సార్థకత బొందాలయా ‖ఉ‖

4. ఇట్టి పరమాత్మనే వివిధ మతముల వారు
బహు నామ రూపముల గొలిచేరయా
గట్టిగా ఈ సత్యమును దెలిసి
మీలోన అన్యోన్య కలహాలు మానండయా ‖ఉ‖

## కీర్తన

శివ కేశవులకు భేదమా! వారిద్ద రొక్కటె తథ్యము జను
లార ! ‖శివ‖

1. ఎద్దు నెక్కినవాడు లింగడు। బొల్లిగద్ద నెక్కినవాడు రం
గడు। ఎద్దు నెక్కినవాడు గద్దనెక్కినవాడు వారిద్ద
రొక్కటి తథ్యము జనులారా! ‖శివ‖

2. ప్రేమబూడిద బూసె లింగడు పట్టె నామాలు ధరియించె
రంగడు। ప్రేమబూడిదబూసె నామము ధరియించె వా
రిద్దరొక్కటె తథ్యము జనులార ! ‖శివ‖

3. తోలు గప్పినవాడు లింగడు। పట్టు శాల్వ గప్పినవాడు రం
గడు। తోలు గప్పినవాడు శాల్వ గప్పినవాడు। వారిద్ద
రొక్కటె తథ్యము జనులార! ‖శివ‖

4. పాము హారము వేసె లింగడు। నాగుబాముపై బవళించె రంగడు। పాముహారము వేసె। పాముపై పవళించె వారిద్ద రొక్కటె తథ్యము జనులార! ॥శివ॥

## ఆత్మసాధన - కీర్తన

"ఏరువాకా సాగునురో రన్నో చిన్నన్నా" మాదిరి

పల్లవి॥ ఆత్మసాధన చేయుమురో రన్నో చిన్నన్నా!
నీ క్షేత్ర మెఱిగి దున్నుమురో రన్నో పెద్దన్నా!

1. ఓంకారం బను నాగలిబన్నుకో। వేదము లను విత్తనములు తీసికో। క్షమ యను భార్యను జతను జేర్చుకో। ఆత్మయనే నీ క్షేత్రముదున్నను అరుగవోయి నీవు పరుగు పరుగున ॥ఆత్మసాధన॥

2. నాసికాగ్రమున దృష్టినిల్పుకో। శ్వాసలనెడి పగ్గముల బట్టుకో। ఆత్మనె మేడిని యదిమిపట్టుకో। సితియనే ములు కఱ్ఱతీసికో। సోహం సోహం బనుచును నిరతము। సూటి సూటిగా కొంౘలు వేసుకో ॥ఆత్మసాధన॥

3. సహస్రారమును మంచెనెక్కరా। సత్యంబను వడిశేల బట్టరా। గురుమంత్రంబను రాళ్ళుబట్టరా। గురుతుదెలిసియు దృష్టినిల్పరా ఈషణ భ్రాంతుల పక్షులదోలరా। శాశ్వత ఫలము నీకే పండురా ॥ఆత్మసాధన॥

4. ఐదుతత్త్వముల కమరినచేనురా। అందరిచూపుల కందని చేనురా। తొమ్మిదిత్రోవల దొడ్డచేనురా। మర్మము గలిగిన మంచిచేనురా। ఇరువదైదు తత్త్వంబులు తెలిసిన। అన్ని పంటలు పండుర చేను ॥ఆత్మసాధన॥

# కీర్తన

పల్లవి. ఆలోచించండి – నిజం ఆలోచించండీ – నిజం
ఆలోచించండీ.

1. ఏటికెన్ని వంకలున్నా – నీటికేమి వంకలేదు,
ఏటివంటి శిష్యుడ నయితే – నీటివంటి ఆత్మనుగంటి ॥ఆ॥
2. చెట్టుకెన్ని వంకలున్నా – పండుకేమి వంకలేదు,
చెట్టువంటి శిష్యుడనయితే – పండువంటి ఆత్మనుగంటి॥ఆ॥
3. చెరుకుకెన్నివంకలున్నా – తీపికేమి వంకలేదు,
చెరుకువంటి శిష్యుడనయితే – తీపివంటి ఆత్మనుగంటి ॥ఆ॥
4. గోవులెన్ని రంగులైనా – పాలకేమి రంగులేదు,
గోవులంటి శిష్యుడనయితే – పాలవంటి ఆత్మనుగంటి॥ఆ॥
5. రాజురైతు యన్న భేదము – బ్రతికియుండే వరకేరా,
మట్టి మట్టి కలిసినాక – ఎట్టి భేదము లేదురా ॥ఆ॥
6. తత్త్వమర్మము తెలియలేక – తప్పుదారుల బోకురా
ఆత్మయొక్కటే చావులేక – అంతటా వెల్గొందురా ॥ఆ॥
7. మలయాళమహర్షి యాన – తెచ్చిన ఆత్మబోధ ఇదే,
సాక్షిసాధు శ్రీభజనబాబు–స్మరణముచేసెడిఆత్మానందం॥ఆ॥

సీ. కాయ కష్టము జేసి కడుపు నింపుచునుండు
డెట్టివేళను సత్యమే వచించు
డిరుగు పొరుగువారి పరిచర్య సలుపుడు
సేవింపు డావుల చిత్తమలర
నిదుర మేల్కాంచుటటి నిదురించుటకు ముందు
శ్రీరామనామంబు జింతసేయు

ఔటువంటి వారిపై నిసుమంత పగలేక
నిరతంబు సత్ప్రేమ నెఱపుచుండు
తే. గీ. ఈవిధంబుగ నడచిన నిహపరముల
శాశ్వతంబగు సౌఖ్యంబు సంభవించు
పరమపావనులగు మన బ్రహ్మవిదుల
తఱచి నుడివిన భారత ధర్మ మిదియ.

## శ్రీ గాంధిమహాత్ముని భావము

సీ. ప్రత్యుదయంబును ప్రథమ కార్యంబుగ
ప్రతిన జేతునుగాక! ప్రదిశమునిట్లు!
జగతి నే నెవరికి జడియకుండెద గాక!
భగవంతునకె భయపడుదుగాక!
ఎవ్వారియెడల నే నెడదలో ద్వేషంబు
లేకుండెదనుగాక! లేశమేని
అన్యాయమునకు నే నణగకుండెద గాక!
ఎవరెన్ని దెల్పిన నించుకేని
తే. గీ. కల్లయాడాని నిజముచే ఖండనంబు
జేయ జూచెదగాక! సుస్థిరముగాను
మిథ్యనెదిరించుపట్ల బాధలొదవ
నేనెన్ని నోర్పుతోనుందుగాక!

మాయామాళవ గౌళ రాగము - రూపక తాళము

ప. తులసీ దళములచే సంతోషముగా పూజింతు||
అ. పలుమారుచిర కాలము-పరమాత్ముని పాదములను|తుల|
చ. సరసీరుహ పున్నాగ - చంపక పాటల కురవక
కరవీర మల్లికా సు-గంధరాజ కుసుమముల్

ధర నివి యొకపర్యాయము - ధర్మాత్ముని సాకేత
పురవాసుని శ్రీరాముని - వరత్యాగరాజ నుతుని ॥తుల

తోడిరాగము - రూపకతాళము

ప. ఆరగింపవే పా - లారగింపవే!
అ. రఘువీర జనకజాకర - పవిత్రితమైన వెన్న
చ. సారమైన దివ్యాన్నము - షడ్రస యుత భక్షణములు
దార సోదరాదులతో - త్యాగరాజవినుత ॥పాలార॥

మంగళము - సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

ప. నీనామరూపములకు- నిత్యజయ మంగళం ।నీ।
అ. పవమాన సుతుడు బట్టు - పాదారవిందములకు ।నీ।
చ. పంకజాక్షి నెలకొన్న - యంక యురములకు ।నీ।
2. నలినారితీరు గేరు నవ్వుగల మోమునకు ।నీ।
3. నవముక్తాహారములు - నటియించే యురమునకు ।నీ।
4. ప్రహ్లాద నారదాది - భక్తులు పొగడుచుండే ।నీ।
5. రాజీవనయన త్యాగ - రాజవినుతమైన ।నీ।

గౌరీరాగము - జంపెతాళము

ప. జయమంగళం - నిత్య శుభమంగళం ॥
చ. మంగళం రుక్మిణీరమణాయ శ్రీమతే
మంగళం రమణీయమూర్తయే తే
మంగళం శ్రీవత్సభూషాయ శార్ఙ్గిణే
మంగళం నందగోపాత్మజాయ ! ॥ జయ
2. పూతనా కంసాదిపుణ్య జనహారిణే
పురుహూతముఖ దేవహితకరాయ

సూత్రాయ విజయస్య సుందర ముఖాబ్జాయ
శీతకిరణాది కులభూషణాయ || జయ

3. కాళియమౌళి మణిరంజిత పదాబ్జాయ
కాలాంబుదశ్యామదివ్యతనవే
కారుణ్యరసవర్షి నయనారవిందాయ
కళ్యాణగుణరత్న వారినిధయే || జయ

4. నవనీతచోరాయ నందాదిగోపగో
రక్షిణే గోపికావల్లభాయ
నారదమునీంద్రనుత నామధేయాయ తే
నారాయణానంద తీర్థగురవే || జయ

శ్లో. మంగళం భగవన్ విష్ణో మంగళం మధుసూదన!
మంగళం పుండరీకాక్ష! మంగళం గరుడధ్వజ. ౧
నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే
సుభద్రాబలభద్రాభ్యాం జగన్నాథాయ మంగళమ్ ౨
మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్|| 3
వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే
పుంసాంమోహనరూపాయ పుణ్యశ్లోకాయమంగళమ్||౪
ఉపనయతు మంగళంనస్సకలజగన్మంగళాలయశ్శ్రీమాన్
దినకరకిరణ నిబోధిత నవనళినదళ నిభేక్షణో రామః. ౫

శ్లో. కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

క. నీపాద కమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
తాపసమందార ! నాకు దయసేయఁగదే.

## "దైవప్రార్థన-కీర్తనలు" పుస్తకము అచ్చు నిమిత్తము విరాళము లిచ్చిన దాతల పేర్లు

| | | |
|---|---|---|
| 1. | ఒంగోలు ప్రేమ సమాజము | 11.00 |
| 2. | దామచర్ల అయ్యన్నచౌదరిగారు (నాయుడుపాలెం గ్రామం - ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా) | 10.00 |
| 3. | పాటిబండ్ల వేంకటేశ్వర్లుగారు, దొడ్డవరప్పాడు | 10.00 |
| 4. | దాసరి నారాయణగారు, ఒంగోలు | 5.00 |
| 5. | కె. రామయ్యచౌదరిగారు | 5.00 |
| 6. | కొండమడుగు వెంకటరెడ్డిగారు పి. సి. 1498 ఒంగోలు పోలీసు స్టేషన్ | 5.00 |
| 7. | బేదంశెట్టి వీరయ్యగారు, బండ్లమిట్ట, ఒంగోలు | 5.00 |
| 8. | తాతా కన్నయ్యగారు, ఒంగోలు | 5.00 |
| 9. | గోరంట్ల రామయ్యగారు, దొడ్డవరప్పాడు, ఒంగోలుతాలూకా | 5.00 |
| 10. | పాటిబండ్ల హనుమంతంగారు ,, ,, | 5.00 |
| 11. | రావెల తిరుపతయ్యగారు, తుళ్లూరుపోస్టు, గుంటూరుజిల్లా | 5.00 |
| 12. | కాకుమాను వెంకటేశ్వర్లుగారు ,, | 5.00 |
| 13. | జొన్నలగడ్డ సాంబయ్యగారు ,, | 5.00 |
| 14. | గద్దె సుబ్బయ్యగారు (తండ్రి) అప్పయ్య ,, | 5.00 |
| 15. | పూల సీతారామయ్యగారు, ,, | 5.00 |

ఉప్పలపాడు పి. ఒ. గోళ్లమూడిగ్రామం, గుంటూరుతాలూకా

16. చెన్నంబలరామయ్యగారు, ఉప్పలపాడు పి.ఒ. గోళ్ళమూడి 5.00

17. పూల కేశవరావుగారు ,, ,, 5.00

18. చెన్నం గోపాల కృష్ణయ్యగారు ,, ,, 5.00

19. పోలవరపు శ్రీమంతయ్యగారు ,, ,, 5.00

20. కాట్రగడ్డ గోపాలకృష్ణయ్యగారు, ధర్మకర్త
వెంట్రప్రగడ, పి. ఒ. ఇందుపల్లి (వయా) కృష్ణాజిల్లా 5.00

21. డా॥ వెంట్రప్రగడ యజ్ఞనారాయణశర్మగారు ,, 5.00

22. త్రిపురనేని కమలమ్మగారు (భర్త) వెంకటాద్రి ,, 5.00

23. లింగాల చుక్కయ్యగారు ,, 5.00

24. ఏలూరు అన్నపూర్ణమ్మగారు ,, 5.00

25. పుసునూరు వెంకటసుబ్బయ్యగారు ,, 5.00

26. కాట్రగడ్డ సీతామహాలక్షుమ్మగారు ,, 5.00

27. ఆలపాటి సీతారామమ్మగారు తనభర్త కీ. శే. ఆలపాటి
వెంకటేశ్వర్లుగారి ఆత్మశాంతి కొఱకు యిచ్చినది యడ్లపల్లి
గ్రామం పి. ఒ., తెనాలితాలూకా 5.00

28. మాగెళ్ల శ్రీరాములుగారు (తండ్రి) రామకృష్ణయ్య 5.00
మండువవారిపాలెం, త్రోవగుంట పి. ఒ. ఒంగోలుతాలూకా

29. కారుమూడి అంజయ్యగారు ,, ,, 5.00

30. మండువ శ్రీరాములుగారు (తండ్రి) కోటిలింగం ,, 5.00

31. మండువ ఆదెయ్యగారు ,, 5.00

32. కాకుమాను చిన్నబ్బిగారు, నిడమలూరు పి.ఒ. 5.00
(వయా) టంగుటూరు ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా

33. కె. ఆదినారాయణగారు ,, ,, 5.00

34. బెజవాడ చెలమయ్యగారు (తండ్రి) వెంకటాద్రి ,, 5.00

35. బెజవాడ వెంకటసుబ్బయ్యగారు (తండ్రి) వెంకటాద్రి,, 5.00

36. కాకుమాను రత్తయ్యగారు ,, 5.00

37. కాకుమాను రామయ్యగారు ,, 5.00

38. కాకుమాను రామన్నగారు ,, 5.00

39. బెజవాడ వెంకటస్వామిగారు ,, 5.00

40. కాకుమాను సుబ్బయ్యగారు ,, 5.00

41. బెజవాడ వీరయ్యగారు (తండ్రి) యరబ్బి ,, 5.00
42. మానిక్లపల్లి కోటయ్యగారు (తండ్రి) చంచయ్య ,, 5.00
43. బెజవాడ బసవయ్యగారు ,, 5.00
44. బెజవాడ శింగయ్యగారు ,, 5.00
45. అంగలకుర్తి రాములుగారు 5.00
46. కాకుమాను సోమయ్యగారు (తండ్రి) కోటయ్య 5.00
47. కాకుమాను అంజయ్యగారు 5.00
48. అక్కినేని సరస్వతమ్మగారు 5.00
పోతురెడ్డిపల్లి, నూజివీడుతాలూకా, కృష్ణాజిల్లా
49. కొత్రటగడ్డ వెంకయ్యగారు, వెంట్రప్రగడ, కృష్ణా 5.00
50. చేబ్రోలు హనుమయ్యగారు, యం. యల్. ఏ. కంబాలగరువు,
గుంటూరు 10.00
51. గారపాటి పుల్లయ్యగారు, పెదపాడు పి. ఒ. పశ్చిమ
గోదావరిజిల్లా 5.00
52. మూల్పూరి రామసుందరమ్మగారు, పెదపాడు పి. ఒ.
యేలూరుతాలూకా 5.00
53. మన్నె రాణి దుర్గావతిగారు, కోడూరు పి. ఒ.
విజయవాడ తా॥ కృష్ణాజిల్లా 5.00
54. బాపూడి సౌభాగ్యమ్మగారు, పెదపాడు పి. ఒ.
యేలూరుతాలూకా 5.00
55. కాకరాల కృష్ణమూర్తిగారు, పెదపాడు పి. ఒ. 5.00
56. పెదపాడు గీతామందిర భక్తులు 5.00
57. గారపాటి శ్రీరామశాస్త్రులుగారు, నాయుడుగూడెం. 5.00
58. గారపాటి రామశాస్త్రిగారు ,, ,, 5.00
59. దోనేపూడి సీతారామయ్యగారు, ఘంటసాల పి. ఒ.
ప్రెసిడెంటు, దివితాలూకా 5.00
60. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, యం.యల్.సి.ఘంటసాల పి.ఒ. 5.00
61. మైత్రేయాశ్రమ భక్తురాలు వెంకమ్మగారు 5.00
62. మైత్రేయాశ్రమ భక్తులు మొత్తము 25.00

63. చలమని రామలింగారెడ్డిగారు, ఒంగోలుతాలూకా పేర్నమిట్ట గ్రామం డిటో పోస్టు 5.00
64. అయినాల వెంకటసుబ్బయ్యగారు ,, ,, 5.00
65. బలిజపల్లి చినలింగారెడ్డికుమార్డు రాఘవరెడ్డిగారు ,, 5.00
66. కత్తినేని నరసారెడ్డిగారు ,, 5.00
67. చక్కా వెంకటసుబ్బయ్య కుమార్డు సుబ్బరాయుడుగారు 5.00
68. రామచంద్రుని వెంకటసుబ్బారావుగారు బి. పి. యం. 5.00
69. పబ్బిశెట్టి ఆదిశేషయ్యగారు 5.00
70. భక్తులు చిల్లరగా యిచ్చినది 23.00
71. శ్రీమతి జొన్నల కోటమ్మరెడ్డిగారు (హనుమారెడ్డి) నంబూరు పోస్టు, గుంటూరుతాలూకా 5.00
72. కూసం రామిరెడ్డిగారు గారు (వెంకటరెడ్డి) ,, ,, 5.00
73. శ్రీ ధనేకుల బ్రహ్మయ్య కుమార్డు నరసింహంగారు తాడికొండ పోస్టు గుంటూరుతాలూకా, గుంటూరుజిల్లా 5.00
74. కంతేటి నాగయ్యగారు ,, ,, 5.00
75. శ్రీ యెజ్జు ఆదెయ్య కుమార్డు రామమూర్తిగారు ,, 5.00
76. చింతల మామయ్యగారు, పరిటాలపోస్టు (వయా) విజయవాడ కృష్ణాజిల్లా 5.00
77. మద్దుల సుబ్రహ్మణ్యంగారు, కంకిపాడు, విజయవాడతాలూక కృష్ణాజిల్లా 5.00
78. మోపర్తి సుబ్బయ్యగారి భార్య మహాలక్ష్మమ్మ 5 వ కుమార్డు సుబ్బయ్యగారు, గుంటూరుతాలూకా తక్కెళ్లపాడుశివారు రామచంద్రపాలెం 5.00
79. చిగురుపాటి అప్పయ్యగారి భార్య మహాలక్ష్మమ్మ కుమార్డు పుల్లయ్యగారు 5.00
80. బోడపాటి నాంచారయ్యగారు, చావలిపంచాయితీప్రెసిడెంటు తెనాలితాలూకా, గుంటూరుజిల్లా 5.00
81. వి. సీతారామయ్యగారు, చావలి ,, ,, 5.00
82. ఘంటా సుబ్బారాయుడుగారు, గూడవల్లె, రేపల్లితాలూకా గుంటూరుజిల్లా 5.00

83. గడ్డిపాటి శేషయ్యగారు, గూడవల్లి, రేపల్లె తాలూకా 5.00

84. మన్నె లక్ష్మయ్యగారు ,, ,, 5.00

85. రావి సుబ్బారావుగారు ,, ,, 5.00

86. చదలవాడ నాగరత్నమ్మగారు, పెదపూడి, తెనాలితాలూకా 5.00

87. చదలవాడ సుందరరామయ్యగారు ,, ,, 5.00

88. రావెళ్ల సత్యనారాయణగారు ,, ,, 5.00

89. కంచర్ల ఈశ్వర వెంకటేశ్వరరావుగారు, రైల్వేహాస్పటలు, విజయవాడ 5.00

90. పెద్ది పుల్లమ్మగారు, ఉప్పలపాడు పి. ఒ. గుంటూరుతాలూక గుంటూరుజిల్లా 5.00

91. తల్లపనేని రాఘవయ్యగారు ,, ,, 5.00

92. కీ. శే. శ్రీ దండమూడి బ్రహ్మయ్యగారి ఆత్మశాంతి కొఱకు వారి కుమారుడు రామారావుగారు ఇచ్చినది 10.00

93. యలమంచిలి వెంకటేశ్వరరావుగారు, కనకదుర్గా మిల్ స్టోర్సు, విజయవాడ 15.00

94. వేమూరి వెంకయ్యగారు, పునాదిపాడు 5.00

95. మాదలి కృష్ణయ్యగారు, నిడమానూరుపోస్టు, బెజవాడతాలూక కృష్ణాజిల్లా 25.00



ఓమ్

# మాతృస్మరణ



**శ్రీమతి మాతృదేవి తోట సుబ్బమ్మగారు**

గద్దలగుంటపాలెం, ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా.

ఆధ్యాత్మిక జ్ఞానసాధనకు అడ్డు కల్పింపక నా క్షేమముల నభిలషించుచు పెంచి పెద్దచేసిన కన్నతల్లికి భక్త్యంజలి సమర్పించుచున్నాడ.

— భజనబాబు.

## సమారాధన సమయములందు మహాత్ములకు

## జై చెప్పు విధానము

1. కరుణానిధి యగు శ్రీ పరబ్రహ్మమునకు జై
2. దయామూర్తి యగు శ్రీ పరమశివునకు జై
3. సర్వలోక శరణ్యుడగు శ్రీ వేంకటేశ్వరులకు జై
4. దయాస్వరూపుడగు శ్రీమన్నారాయణమూర్తికి జై
5. గీతామూర్తి యగు శ్రీకృష్ణస్వామికి జై
6. జ్ఞానగురు శ్రీ దక్షిణామూర్తికి జై
7. బోధగురు శ్రీ దత్తాత్రేయులకు జై
8. పరబ్రహ్మస్వరూపుడగు శ్రీరామమూర్తికి జై
9. జగజ్జననియగు శ్రీ అన్నపూర్ణేశ్వరికి జై
10. సిద్ధగురు శ్రీకార్తికేయస్వామికి జై
11. వేదనిధి శ్రీ వేదవ్యాసమహర్షికి జై
12. శ్రీరామభక్త శ్రీ హనుమానునకు జై
13. జగద్గురు శ్రీశంకరాచార్యస్వాములవారికి జై
14. లోకోద్ధారక శ్రీనారాయణగురుచరణారవిందములకు జై
15. భగవాన్ శ్రీరామకృష్ణపరమహంస పాదకమలములకు జై
16. శ్రీసద్గురు మలయాళస్వాములవారి పాదపద్మములకు జై
17. ఆశ్రమదైవమునకు జై
18. సమస్త చరాచరములకు జై
19. మన అందరి గురుస్వాముల పాదకమలములకు జై
20. శ్రీమాన్ (లేక) శ్రీమతి వారి తల్లిదండ్రులకు జై



పల్లవి. భారతవీరా! వినవయ్యా
నీలో శాంతిని కనవయ్యా

1. కలిమికి మురిసి। గర్వము బలిసి,
గమ్యము। మఱచి పోకోయి
మనసును నిలిపి। మదమును నలిపి
మదిలో దేవుని తలచోయి. ॥భార॥

2. దేహమువదలి జగమును కదలి
పోయిన మరిరావలనోయి
బంధ విముక్తిని పొందే శక్తిని
తొందరగానే చూడోయి. ॥భార॥

3. ఆత్మకు చావు యెన్నడు లేదు
అది యవినాశి కనుమోయి
పుట్టుట చచ్చుట బూడిద యగుట
పట్టి శరీరముకేనోయి. ॥భార॥

4. రేపుమాపని రేయి పగలని
కాలము గడుపుట తగదోయి
వెంటనె లేచి వందన జేసి
విశ్వరూపుని భజించవోయి. ॥భార॥



# శ్రీ మలయాళ స్వాములవారి వాక్యములు

వర్ధతాం బ్రహ్మ విద్యాచ లోకేభ్యః సుఖమేధతాం.
తపసా కల్మషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే.

దైవ మతము ప్రతిష్ఠిత మగునుగాక!
కరుణా మతము వృద్ధి నొందును గాక!
శాంతి మతము స్థాపిత మగును గాత!
సత్య మతము స్థిర ప్రతిష్ఠ నొందును గాక!
ధర్మ మతము యుద్ధరింప బడును గాక!
ఋషి మతము వర్ధిల్లును గాత!
స్వాతంత్ర్య మతము జయించును గాక!
జ్ఞాన మతము వ్యాపక మగును గాక!

## పంచశీలములు

1. సచ్చింతనము, 2. సద్గ్రంథపఠనము, 3. సత్ప్రవర్తనము, 4. సత్కర్మము, 5. సత్సంగము. ఈ పంచశీలములను చక్కగా యనుష్ఠించువారలు, పంచభూతాత్మకమైన దేహమునకు పంచభూతములు సమావస్థలో యుండిన, యేలాగున సౌఖ్యము గలిగియుండునో, వానిలో యేదైన యొక లోపము గలిగినచో శరీరమునకు రోగముగలుగునో, యాలాగున యీ పంచశీలములలో దేనికైన కొఱతగల్గినచో యాత్మజ్ఞాన సౌఖ్యములోగూడ హాని గలవారగుదురు.

ఓం తత్ సత్